


చాముణ్డా ప్రేతగా కృష్ణా వికృతా చాహిభూషణా।
దంష్ట్రా లాక్షీణదేహా చ గర్తాక్షీ కామరూపిణీ॥
దిగ్బాహుః క్షామకుక్షీ చ ముసలం చక్రచామరే।
అఙ్కుశం బిభ్రతీ ఖడ్గం దక్షిణే చాథ వామకే॥
ఖేటం పాశం ధనుర్దణ్డం కుఠారం చాపి బిభ్రతీ॥

శ్రీః

శ్రీ ముల్గు పాపయారాధ్యకృత

# ముక్తిద్వారస్తవరత్నరాజము

"ఉద్ఘాటనీ" వ్యాఖ్యాసహితము

వ్యాఖ్యాత

శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి



ముక్తిద్వారము తల్పు దీయగదె చాముండా! జగజ్జనని

**రావి మోహన రావు**

డాండీ హౌస్, 404, జంజనం కాంప్లెక్స్,

చీరాల - 523 155

పాపయారాధ్యులు, ముక్తిద్వారస్తవరత్నరాజమున=ముక్తిద్వారము అను శీర్షికతో నున్న స్తోత్రరత్నము వలన, ఎంతే=ఎంతో, మెచ్చగా=మెచ్చునట్లుగా, చేసెడిన్= చేయును. స్వాదు=ఇష్టమయిన, అస్వాదు=అనిష్టమయిన, ఫలాభిలాషలు=ఫల వాంఛలు, ఇతర=ఇతరుల యొక్క/ఇతరమైన, వ్యాసంగము=అభ్యాసము, ఆలింతువే=విందువా?, పరార్థ=పరమార్థము యొక్క ప్రాప్తి=పొందవలెననే, వాంఛ=కోర్కె యందు, రతుల్=ఆసక్తికలవారు, తద్వత్=ఆ పరమార్థము గల, శ్రీకము=ఉన్నత పదవిని, పొందకుందురే=పొందకపోదురా?

**తాత్పర్యము :** అమరావతిలోని క్రౌంచగిరి దేవతయగు బాలచాముండిక పండితవందిత. అట్టి దేవతను ముల్లు పాపయ్య అను నేను ముక్తిద్వార శీర్షికగల స్తవరత్నరాజముతో మెప్పించితిని. రాగద్వేష సంబంధమయిన ఫలవాంఛలు ఇతర వ్యాసంగము అగును. అది నీవు విందువా? పరమార్థవాంఛగలవారు ఆపరమానంద పదవిని పొందకపోదురా?

మేళ్లచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి రచిత "ఉద్ఘాటనీ" వ్యాఖ్య సమాప్తము.

ఇది

*గుంటూరు*

మహామండలాంతర్గత,

వట్టి చెఱుకూరు గ్రామవాస్తవ్య,

కంచర్ల గోత్ర సుధార్ణవ తరంగాయమాన,

రావివంశసంజాత, శ్రీ వేంకట సుబ్బయ్య సీతారావమ్మ

దంపతిరూప శుక్తిసంపుట సముద్భూత శ్రీ రావి మోహనరాయ

(రా॥మో॥రా) మౌక్తిక వరేణ్య ప్రచురితంబై ఈ వ్యయనామ సంవత్సర

*(15 - 10 - 2006)* ఆశ్వియుజ మాసంబున అమరావతీ క్షేత్రంబున

పాపయారాధ్యరచితస్తవరత్నరాజసంస్తుతయైన బాలచాముండికాదేవికి

పాదపద్మమండనంబుగా సమర్పింపబడె.

శ్రీశ్రీశ్రీ

శ్రీః

శ్రీ ముల్లు పాపయారాధ్యకృత

# ముక్తిద్వార స్తవరత్నరాజము

## "ఉద్ఘాటనీ" వ్యాఖ్యాసహితము

వ్యాఖ్యాత

శ్రీ మేళ్ళచెఱ్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి



ముక్తిద్వారము తల్పు దీయగదె చాముండా ! జగజ్జనని

**రావి మోహనరావు**

డాండీ హౌస్, **404**, జంజనం కాంప్లెక్స్,

చీరాల - **523 155**

# శ్రీః

## శ్రీ ముల్గు పాపయారాధ్యకృత

# ముక్తిద్వార స్తవరత్నరాజము

## "ఉద్ఘాటనీ" వ్యాఖ్యాసహితము

శ్రీ మేళ్ళచెఱ్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి
సంస్కృతాధ్యాపకుడు,
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల, తిమ్మసముద్రం.

పేజీలు : 32
అమూల్యమ్
ప్రథమ ముద్రణము: వ్యయ నామ సంవత్సరము - 15.10.06
ద్వితీయ ముద్రణము : 22-10-2015

© **Ravi Mohan Rao,** *M.Sc., M.A. (Sanskrit)*
Dandy House, 404, Janjanam Complex,
**Chirala - 523 155**
Cell : 9440115411

D.T.P. at
**Sanjay Graphics,**
**Chirala.**
Cell : 9966156263

Printed at
**Sowmya Printers**
**Chirala.**
Cell : 9848088156



**త్యుక్తుల్ పొన్దిరి యాత్మలెల్ల జననాన్తోర్ధ్వల్ మిమున్ గొల్చి నీ**
**ముక్తి ద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 28**

ప్రతిపదార్థము : తుక్ (తుజ హింసాయాం)=బాధించు, తన్వీ=కాంతా, ధన=కనక, లాభ=ప్రాప్తియందలి, లోభములతో=ఆసక్తితో, త్రోపుల్=విక్షేపములు, తలంబట్టి=తలకు బాగాపట్టి, ఆ=ఆ, శుక్‌తాప=శోకతాపములను, అపహ=పోగొట్టునట్టి, సంవృత=గూఢమయిన, జ్వలన=జ్ఞానాగ్ని యొక్క విక్షోభంబు=ఉద్రేకమును, కల్పించి=చేసి, జననాంత=జన్మాంతమునందు, ఊర్ధ్వల్=పైవారయిన, ఆత్మలెల్ల=ఆత్మలన్నియును, మిమున్=మిమ్ములను, కొల్చి=సేవించి, ప్రత్యుక్తుల్=సమాధానమును, పొందిరి=పొందినారు. నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** కాంతాకనక వాంఛలు బాధిస్తున్నాయి. వాటితో తలపట్టిపోయినది. వీటివలన శోకసంతాపములు వచ్చినవి. అట్టి సంతాపములను పోగొట్టునట్టి అంతర్గతమయిన జ్ఞానాగ్నిని రగిలించి మిమ్ము సేవించి పూర్వులు జననాంతమున ఊర్ధ్వలోకములను పొంది సమాధానపడిరి. అమ్మా! అందువలన అట్టి నాకు గూడా నీ అధీనములోని ముక్తిద్వారమును తెఱచి మోక్షమును కటాక్షింపుము.

**శ్లో॥** **విద్వద్వన్దితయైన "క్రౌంచగిరి" దేవిన్ ముల్గు పాపయ్య ము,**
**క్తిద్వార స్తవరత్నరాజమున నెన్నేమెచ్చుగా జేసెడిన్**
**స్వాద్వస్వాదు ఫలాభిలాష లితరవ్యాసజ్గ మాలిన్తువే**
**తద్వ్యచ్ఛీకము నొన్దకున్దురె పరార్థప్రాప్తి వాంఛారతుల్. 29**

ఇయ్యది శ్రీ పరమశివాద్వైతభావనాసాధ్య ముల్గుసదన్వయ సిద్ధ
సారస్వతవిద్యాసాన్నిధ్య, వేమనారాధ్యవంశార్ణవకళానిధాన,
పాపయారాధ్యాభిధాన, ప్రణీతంబైన ముక్తిద్వారస్తవరత్నరాజము
సంపూర్ణము.

ప్రతిపదార్థము : విద్వద్వందితయైన=పండితస్తుతయైన, క్రౌంచగిరి దేవిన్=క్రౌంచగిరి వాసినియైన బాలచాముండికను, ముల్గు పాపయ్య=ముల్గు

చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె= తెఱవరాదా!

**తాత్పర్యము :** అర్ధనారీశ్వరులయిన మీ దంపతులు ముత్యాలు తలంబ్రాలు పలుమార్లు పోసికొనగా అవి మీ తలమీది నీటినుంచి జాలువాఱగా ఈ ముత్యములు ఆకాశమునుండి వచ్చిన నక్షత్రాలో, మేఘముల నుండి వచ్చిన వడగండ్లో తెలియుట లేదు. తెలియుటకు నీవు ముక్తిద్వారము ఉద్ఘాటింపుము. అభ్రకేశులనగా ఆకాశము/మబ్బులు కేశములుగాగలవారు అర్ధనారీశ్వరులు.

**శ్లో॥** **సక్తిన్ నామభవాభిముఖ్యులగు నాసాశక్తు లత్యన్తిమా**
**సక్తాబ్జోదర పీఠి నీవు మధువాస్వాదించుచో గ్రమ్మి జం**
**ఝుక్తాళమ్ములు వ్రేయ గంతులిడు నాస్థన్ జెన్దియున్నాడ, నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **27**

**ప్రతిపదార్థము :** సక్తిన్=ప్రేమచే, నామభవ=భ్రామరి అన్న పేరు వలన వచ్చిన, అభిముఖ్యులగు=అనుకూల్యముగలవగు, నాసాశక్తులు=తుమ్మెదలు, అత్యంతి మాసక్తాబ్జోదరపీఠి=మిక్కిలి/చివఱగా ఆసక్తమయిన కమలపీఠమున, నీవు=నీవు, మధువు=మకరందమును, ఆస్వాదించుచో=రుచిచూచునపుడు, క్రమ్మి=మూగి, జంఝుక్తాళంబులు=ఝుంకార తాళములు, వ్రేయ=వ్రేయగా, గంతులిడు= నర్తించు, ఆస్థన్=శ్రద్ధను, చెందియున్నాడ=పొందియుంటిని. నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** అమ్మవారికి 'భ్రామరి' అని పేరు. ఒకానొక రాక్షస సంహారములో ఆమె భ్రమరసైన్యాన్ని ఉపయోగించింది. అందువలన భ్రమరములకు భ్రామరికి నామసంబంధం ఉంది. అట్టి సంబంధంతో తుమ్మెదలు నీవు సహస్రార కమల పీఠమున మధుపానము చేయునపుడు నీ చుట్టు మూగి ఝుంకారములు చేయుచుండును. ఆ దర్శనమున నేను నృత్యము చేయవలయునని కోరుచున్నాను. తల్లీ ముక్తిద్వారము తల్పు తీయుము. **భ్రమరములు అనగా జీవులకు ప్రతీకలు అని గ్రహించవలసినది.**

**శ్లో॥** **తుక్తస్వీధనలాభలోభములతో ద్రోపుల్ దలమ్బట్టి యా**
**శుక్తాపాపహ సంవృత జ్వలన విక్షోభమ్ము గల్పించి ప్ర**



## కుంచిక

ఈ **"ముక్తిద్వార స్తవరత్న రాజము"** వ్రాసిన కవి **ముల్గు పాపయారాధ్యులవారు.** వీరు సుమారు 1756-1770 ప్రాంతమువారు. శ్రీ రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడుగారి ఆస్థానములో మెఱసిన నవరత్నాలలో వీరి స్థానము "వజ్ర రత్నము". వజ్రం రత్నరాజము. ఈ వజ్రరత్నము ప్రణయించిన స్తవము గూడా 'రత్నరాజమే'. వీరు తనను గురించి

"పరమ శివాద్వైతభావనాసాధ్య,
సిద్ధ సారస్వత విద్యాసాన్నిధ్య
పాపయారాధ్య" అని వ్రాసికొన్నారు.

ఆస్థాన కవి అయి గూడా రాజభోగములనుభవింపక దరిద్రతనే వరించిన ధైర్యశాలి, ధీశాలి. వీరి అసలు పేరు సంగమేశ్వరుడు. వ్యవహార ప్రసిద్ధ నామము పాపయారాధ్యులు.

ప్రస్తుత పద్యములు శ్రీదేవీ భాగవత పీఠికయందు '2' విడతలుగా ముద్రింపబడినవి. ఇవి దుష్కర "క్త" ప్రాసంలో ఉన్నవి. దీనివలన సమన్వయం దుర్ఘటమయ్యేటంత క్లిష్ట పదబాహుళ్యము, నేయార్థత వచ్చిపడినవి. అచ్చటచ్చట వ్యాకరణ విరోధాలున్నవి. శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఈ దేవీ భాగవతమును సంస్కరించి విస్తృతమయిన 'పీఠిక' వ్రాసారు. ఆ సందర్భంలో వారన్న మాటలు గమనించదగినవి.

"గ్రంథకర్త స్వహస్త లిఖితమైనది దొరకలేదు. అందువలన గొన్ని ప్రమాదములు గూడా నుండవచ్చును. కొన్ని సవరించితిని. కొన్ని సవరింప లేకపోయితిని. క్షంతుమర్హంతి సంతః" - చెళ్లపిళ్ల.

దీనినిబట్టి వివిధ కారణాల వలన ముఖ్యంగా లేఖక ప్రమాదము వలన ఈ పద్యాలలో అర్థంకాని పదప్రయోగాలు సంభవించినట్లు, కొన్ని సవరింపలేనివయినట్లు, కొన్ని సవరణలు తాము చేసినట్లు తెలియుచున్నది. దీనివలన కవిభావములు అర్థంకాని పరిస్థితి వచ్చినట్లు తెలియుచున్నది. చూ॥

"ఆ యీ పద్యములనే కొన్నింటినో తప్ప సహృదయాహ్లాదకము లయిన భావములు గోచరింపవు" - చెళ్లపిళ్ల

కాని అసలు భక్తి శతకపద్యాలు అన్నింటిలోనూ ఈ పరిస్థితి సహజంగా ఉన్నదే. ఆ ప్రక్రియ అలానే ఉన్నది.

అయితే పాపయారాధ్యులు విద్వత్కవి. నీరస పద్యములను వ్రాయునా? అన్నది ప్రశ్న. దానికి చెళ్ళపిళ్ళవారు చేసిన సూచన.

"పాపయారాధ్యుల జీవితకాలములో వారి నుంచి విన్న వారెవరేని తెల్పినను ఆ శ్రోతృ పరంపర యెచ్చటనేని యున్నచో వారి వలన నిందలి రహస్యముల గ్రహింపవలను పడును.

జీవతః కవేః ప్రష్టవ్యమ్" – చెళ్ళపిళ్ళ

అయితే చెళ్ళపిళ్ళవారే అన్నట్లు ఏ పద్యగ్రంథాల్లోనయినా పూర్తిగా హృదయావర్జక శ్లోక సంఖ్య ఒక మాదిరిగానే ఉంటుంది.

**"ఇతర కవుల్ప్రయాసపడి యెంచి రచించిన నూటికెన్ని, పె**
**ద్దతనము గాంచి, చిత్తమును దన్పునొ మేమవధాన సంగతిన్**
**స్థితిగని యాశుగా రచన చేసిన పద్యములందు చూచినన్**
**శతమున కన్ని పద్యములు చక్కగ నుండు నసంశయమ్ముగన్"**

**– తిరుపతి వేంకటకవులు**

ఈ విధంగా చూచినచో ఈ పద్యములోనయినా ఆ 'శాతము' ఉండకపోదు. దుష్కర ప్రాసవలన కొంత క్లిష్టత రావటం వాస్తవం. అయితే 'ముక్తి ద్వారము...' అను నీ శీర్షిక చాల రమణీయమయినది. యోగ శాస్త్రీయ మయినది. దీనివలననే ఆయన దుష్కర ప్రాసకయినా ఇష్టపడి యుండును. కవులకు కొన్ని పదాల మీద ఆసక్తి అంత బాగా ఉండటం సహజమే. "సదసత్సంశయ గోచరోదరీ, గమికర్మీకృత నైకనీవృతా" అను "2" పదాల కోసం శ్రీనాథుడు ఒక చిన్న వృత్తానికి "2" మత్తేభాలను – పునరుక్తి దోషం గూడా అంగీకరించి మఱీ వ్రాశాడు. పైగా ఈ దుష్కర ప్రాసము ఆయనకు కవిత్వంలో దేవీ మహిమ చింతనావకాశాన్ని పెంచుతుంది. భక్తుల భావనలు అలానే ఉంటాయి. ఆశుకవిత్వం చెప్పేవాడికి కవిత నాలుక మీదనుంచి జాఱి పడుతుంది. సాధారణ కవికి ఒక పద్యం వ్రాయాలంటే పదార్థమననం చాలాసేపు – నెమఱుగా – చేయవలసి ఉంటుంది. దానితో భాగవత ధ్యానం



**స్పృక్తేజోజ్వలితాత్మసంయుతుడనైశ్రేయమ్మునగన్నాద, నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 25**

**ప్రతిపదార్థము :** ఋక్=ఋగ్వేదమంత్రములకు సంబంధించిన, తేజః=అగ్నుల చేత, జ్వలిత=వెలిగిన, ఉపలత్రయ=వేదికాత్రయమునందు, కృత=చేయబడిన, అభీష్ట=ఇష్టమును(యజ్ఞమును), అనుసంధాతృ=అనుసంధానము చేసిన, ఋత్విక్=ఋత్విక్కులవలన, తృప్త=తృప్తిపొందిన, అధ్వరి=యజమానుని యొక్క వధూ=సోమిదమ్మయొక్క, అవత్=రక్షించునట్టి, విమల=నిర్మలమయిన, నైవేద్య =పురోడాశాదినైవేద్యములచేత, ఉద్గృహీత=ఉద్ధరింపబడిన, ఇంద్రియ=ఇంద్రి యములను, స్పృక్=స్పృశించునట్టి తేజః=తేజస్సుచే, జ్వలిత= వెలిగిన, ఆత్మ= మనస్సుచేత, సంయుతుడనై=కల్గినవాడనై, శ్రేయంబు=శ్రేయస్సును, కన్నాద= పొందినాడను, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము= మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె= తెఱవరాదా!

**తాత్పర్యము :** వేదమంత్ర జ్వలితమయిన త్రేతాగ్నులయందు యజ్ఞములు చేసి సంతృప్తిజెంది సోమిదమ్మ పెట్టిన నైవేద్యములతో పవిత్రుడనయిన నాకు తల్లీ! ముక్తిద్వారము తల్పు తీయుము.

**శ్లో॥ మౌక్తుల్ సాఞ్జలులై సతీపతులు పల్మాఱున్ దలఁబ్రాల్ మహో**
**ద్యుక్తిన్ నిమ్పగ నభ్రకేశులగుటన్ దోయమ్ములన్ వచ్చు నీ**
**ముక్తల్ నింగివియో మొగిళ్ళవొ యనన్ బోధిమ్పగా దల్లి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 26**

**ప్రతిపదార్థము :** సతీపతులు=దంపతులు, సాంజలులై=దోసిలి కట్టి, మౌక్తుల్= ముత్యాల సంబంధమయిన, తలంబ్రాల్=తలంంబ్రాలను, పల్మాఱున్= పలుమార్లు, మహోద్యుక్తిన్=మహా ప్రయత్నముతో, నింపగ=ఒకరిమీదఒకరు పోయగా, అభ్రకేశులగుటన్=ఆకాశము/మేఘము కేశములుగాగలవారగుట వలన, తోయంబులన్=నీళ్ళలో, వచ్చు=వచ్చుచున్న, ఈ=ఈ, ముక్తల్= ముత్య ములు, నింగివియో=ఆకాశానివో, మొగిళ్ళవో=మేఘాలవో, అనన్=అనగా, బోధిపంగా=తెలుపగా, తల్లి!=అమ్మా!, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము= మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను

దేవాంగనా సంఘముల్=దేవకాంతా సమూహములు, ముక్ (ముజ్ శబ్దే అను ధాతువు) మ్రోగు, తానస్వరమేళనంబులుగ=తానము, స్వరముల కలయిక కలుగునట్లుగా, ఇమ్ముల్=ఇంపులను, పెంచి=పెంచి, నర్తింప=నృత్యము చేయగా, సద్భక్తిన్=మంచి ప్రేమను, చూపెడు=చూపించెడు, వాకిటన్=వాకిటియందు, నిలిచి=నిలిచియుండి, చింతా=దిగుళ్ళు అను, తంతువుల్=త్రాళ్ళను, త్రెంచి=త్రెంచి, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారము యొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** ధింధిమిధ్వనులతో దేవకాంతలు రాగతాళములతో నృత్యము చేయుచుండగా నీవు చూచుచు నిలిచియుండు సభాద్వారమున నుండి ముక్తి ద్వారమును నాకు తెఱచి యుంచుము.

**శ్లో॥ త్వక్తారుణ్యము డుస్సె డస్సె వలవన్తల్ చూపు లోపించె న**
**వ్యక్తమ్బయ్యె దిగన్తరాళము భవిష్యద్భ్రాన్తులూటాడె సం**
**పృక్తంబయ్యెను బుద్ధిమాన్ద్యము భవత్ప్రేమమ్బు దిక్కణ్టి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 24**

**ప్రతిపదార్థము :** త్వక్=చర్మము యొక్క, తారుణ్యము=బలము, డుస్సె=సడలినది, వలవంతల్=దుఃఖములు/కోరికలు, డస్సె=సడలినవి. చూపు=చూపు, లోపించె=తగ్గినది, దిగంతరాళము=దిక్కుల మధ్య భాగము, అవ్యక్తంబయ్యె=అస్పష్టమయినది. భవిష్యత్=భవిష్యత్తుకు సంబంధించిన, భ్రాంతులు=మిథ్యామనోరథములు, ఊటాడె=ఊగిసలాడినవి, బుద్ధి మాంద్యము =బుద్ధిలోపము, సంపృక్తంబయ్యెను=కలిసినది, భవత్=నీయొక్క, ప్రేమంబు=వాత్సల్యమే,దిక్కంటి=దిక్కుఅనిఅంటిని, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!,జగత్=ప్రపంచమునకు,జీవనీ=బ్రతికించుదానా!,తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** వయస్సు ఉడిగినది, కోరికలు సడలినవి, చూపు తగ్గినది. దిక్కులు స్పష్టంగా కనబడుటలేదు. భవిష్యత్తు గూర్చి చేసిన అంచనాలు కదలు తున్నాయి. బుద్ధి మందగించింది. తల్లీ! నీ ముక్తిద్వారము తల్పుతీయరాదా!

**శ్లో॥ ఋక్తేజోజ్వలితోపలత్రయకృతాభీష్టానుసంధాతృఋ**
**త్విక్కృప్తాధ్వరివధ్వవద్విమలనైవేద్యోద్యదృహీతేన్ద్రియ**



ఎక్కువవుతుంది. ఈ దేవీభాగవతునకు అదే జరిగి ఉంటుంది. అప్పయ్యదీక్షితుల వారి ఆలోచన చూడండి.

**"మన్యే సృజన్త్యభినుతిం కవిపుఙ్గవాస్తే**
**తేభ్యో రమారమణ! మాదృశ ఏవ ధన్యః।**
**త్వద్వర్ణనే ధృతరసః కవితాతిమాన్ద్యాత్**
**యస్తత్తదఙ్గచిరచిన్తనభాగ్యమేతి॥"**

కనుక కమ్మని శీర్షిక, దుష్కర ప్రాస వలన అదనంగా వచ్చిపడిన దేవీ చింతన సమయము ఈ కవిని ఈ తారావళిని (27-28 పద్య గుచ్ఛము) వ్రాయుటకు పురికొల్పియుండును.

ఒక 'వదంతి'ని బట్టి ఈ కవి భార్యామరణవియోగతప్తుడై తనకున్ను మోక్షమునిమ్మని దేవిని బ్రతిమాలికొన్న శోకశాంత సమ్మేళనమీ పద్యఘట్టము. ఈ ఘట్టములో వచ్చినదే యీ స్తవరత్నరాజము. "గుండె" పగులగొట్టికొని తనంతతానుగా వచ్చినదే కవిత్వము. అట్టి ఉద్భిజ్జమగు కవిత ఏ ప్రాసలో నయినా అవారితంగా నడుస్తుంది. ఆదికావ్యమే అలా వచ్చింది గదా!

**"శోకః శ్లోకత్వమాగతః"**

మహా భక్తుడగునీయన ఈ పద్యములను ఏమి మర్మములతో వ్రాసెనో మనము తెలిసికొనలేకపోవుచున్నాము.

**"ఈయనను రెండవ పోతరాజుగా సంభావింపనగును"** – చెళ్ళపిళ్ళ

ఎంత భక్తుడయినా "సమకాలమువారలు మెచ్చరే గదా!" అని చేమకూర అన్నట్లు నాటివారు అసూయతో "పరలోక ద్వారము సంగతి ఏమో గాని ఈ పద్యాలకు ఈ లోకంలో గుడి తలుపులు తెఱవమనండి చూద్దాం" అని సవాలు చేసినట్లు, దానికి ఎట్లో ఒప్పుకొన్న వెంకటాద్రినాయుడు ఆ పరీక్షను ఏర్పఱచినట్లు పాపయారాధ్యుల పద్య ప్రభావముతో అమరావతిలోని క్రౌంచగిరి బాల చాముండికా దేవి గుడి తలుపులు స్వయముగా తెఱచికొన్నట్లు జనశ్రుతి. ఇట్టి ప్రభావవంతమయిన ఈ పద్యములలోని ముక్తిద్వార కవాట భేదన మర్మమేమో ప్రామాణికంగా పరిశీలనము చేద్దాం.

**"శీర్షికా" పరిశీలనము:-**

ఇంతకూ ఈ పద్యాలను బట్టి చూస్తే ముక్తి ద్వారపు తల్పు తీయవలసినది విద్యాశక్తి అని, అపుడే మోక్షము సిద్ధించునని, ఇదంతా విద్యాశక్తి అనుగ్రహముంటేనే జరుగునని తెలియుచున్నది. ఇదంతా యోగ, తంత్ర, పురాణపథములలో ప్రహతమయిన విషయమే. చూ॥

**1) కన్దోర్ధ్వే కుణ్డలీశక్తిః-అష్టధా కుణ్డలాకృతిః।**
**బ్రహ్మద్వారముఖం నిత్యం-ముఖేనాచ్ఛాద్య తిష్ఠతి॥**

- యోగచూడామణ్యుపనిషత్

మూలకందం పైభాగమున కుండలీశక్తి కలదు. ఆ శక్తి తన పడగతో బ్రహ్మద్వారముఖమును కప్పి ఉండును.

**2) యేన ద్వారేణ గన్తవ్యం-బ్రహ్మద్వారమనామయమ్।**
**ముఖేనాచ్ఛాద్య తద్ద్వారం-ప్రసుప్తా పరమేశ్వరీ॥**

- యోగచూడామణ్యుపనిషత్

బ్రహ్మద్వారమునకు మనం ఏ ద్వారం గుండా వెళ్ళవలసి యున్నదో ఆ ద్వారమును పడగతో కప్పి కుండలినీ పరమేశ్వరి సుప్తరూపంగా ఉంటుంది.

**3) పరితః కన్దపార్శ్వే తు-నిరుధ్యైవ సదా స్థితా।**
**ముఖేనైవ సమావేష్ట్య-బ్రహ్మరన్ధ్రముఖం తథా॥**

- త్రిశిఖ బ్రాహ్మణోపనిషత్

కుండలినీ శక్తి సుషుమ్నా నాడిలో ఉండే బ్రహ్మరంధ్ర ద్వారమును కప్పి ఉంటుంది.

ఈ కుండలిని ఉత్థానము చెందినచో ఏమి జరుగును? బ్రహ్మద్వార కవాటము తెఱచికొని మనకు సమాధి సిద్ధించును.

**4) ప్రబుద్ధా వహ్నియోగేన-మనసా మరుతా తథా।**
**సూచీవద్గాత్రమాదాయ-వ్రజత్యూర్ధ్వం సుషుమ్నయా॥**

- యోగచూడామణ్యుపనిషత్

మనస్సు, ప్రాణము, అగ్ని - వీనియోగం వలన మేల్కొన్న "కుండలిని" సుషుమ్నానాడి ద్వారా ఊర్ధ్వగమనము చేయును.



దానా!,జగత్=ప్రపంచమునకు,జీవనీ=బ్రతికించుదానా!,తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** మోక్షవాంఛతో అమ్మా! నీ దర్శనముకోరితిని. కన్నుల చివఱ ప్రతిఫలించిన చిఱునవ్వు మొలకతో, రత్నములవంటి పలువరుసతో, అధరోష్ఠ ప్రభలతో వెలుగొందు నీ ముఖచంద్రుని అందములు చిందించుచు, తల్లీ! ముక్తిద్వారము తల్పు దీయుము.

**శ్లో॥ స్ఫిక్తారుణ్యము మధ్యమమ్మును సునాభీలీల లోకత్రయీ**
**భాక్తౌల్యమ్మును గర్తృ కార్యతల తెల్పన్ లోకమాతృత్వ ధీ**
**యుక్తిన్ గాంచితి వేఱెయేల? భవదీయున్ బ్రోవనింకేరు? నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 22**

**ప్రతిపదార్థము :** స్ఫిక్=పిరుదుల యొక్క, తారుణ్యము=బలము, మధ్యమంబును=నడుమున్ను, సునాభీలీల=నాభివిలాసము, లోకత్రయీ=ముల్లోకములను, భాక్=పొందు, తౌల్యంబును=పోలికను, కర్తృ=కర్తృత్వమును, కార్యతల=కార్యత్వమును, తెల్పన్=తెలుపగా, లోకమాతృత్వ=లోకమాతఅగుట యొక్క, ధీ=బుద్ధి యొక్క, యుక్తిన్=యోగమును, కాంచితి=పొందితివి. వేఱె=వేఱేది, ఏల=ఎందుకు?, భవదీయున్=నీ బిడ్డను నన్ను, బ్రోవ=రక్షింపగా, ఇంక=నీవు కాక, ఏరు=ఎవరు? నీ=నీ వశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్కతల్పు=తలుపును,చాముండా=చండముండాసురులను చంపిన దానా!,జగత్=ప్రపంచమునకు,జీవనీ=బ్రతికించుదానా!,తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** నీ స్వరూపము నీ లోకమాతృత్వమును తెల్పుచున్నది. నీ పిఱుదులు భూలోకమును, మధ్యము భువర్లోకమును, నాభి నుంచి ఉన్న భాగము స్వర్లోకమును సూచించును. నీవు కర్తవని, విశ్వము కార్యమని దీనిని బట్టి తెలియును. అందువలన నిన్ను లోకమాతగా గుర్తింపగల్గితిని. నేను బిడ్డనని తెల్సినది. ఇంక నన్ను రక్షించుటకు వేరెవ్వరో ఎందుకు? నీవానిని రక్షించటానికి ఎవరు వస్తారు. అమ్మా! ముక్తిద్వారము తెఱువుము.

**శ్లో॥ ధిక్తాంధిన్ధిమిధిక్తధెయ్యనుచు నద్దేవాఙ్గనాసఙ్ఘముల్**
**ముక్తానస్వరమేళనమ్ములుగ నిమ్ముల్వొంచి నర్తిమ్ప స**
**ద్రక్తిన్ జూపెడు వాకిటన్ నిలిచి చిన్తాతన్తువుల్ ద్రెంచి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 23**

**ప్రతిపదార్థము :** ధిక్తాంధింధిమి ధిక్తధెయ్ అనుచు=పై శబ్దములు చేయుచు,

శ్లో॥ దృక్తారమ్ములు సేసచల్లి మధురోక్తిస్రక్కు లాకణ్ఠ మా
ముక్తస్ఫూర్తి నలఙ్కరిమ్పుచు గరమ్ముల్ మోడ్తునంచంటి వి
ష్వక్తేజమ్ము దిగన్తరాళములు గప్పన్ మూర్తి గాన్పించి నీ
ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. **20**

**ప్రతిపదార్థము :** దృక్=చూపులనెడి, తారంబులు=ముత్యములు, సేసజల్లి=అక్షతలుగా చల్లి, మధురోక్తి=మధుర వచనములనెడి, స్రక్కులు, దండలను, ఆకంఠము=కంఠముదాక, ఆముక్తస్ఫూర్తిన్=తొడిగినట్లు, అలంకరింపుచు=అలంకరించుచు, కరమ్ముల్=చేతులను, మోడ్తునంచు=ముకుళించెదనని, అంటి=అంటిని. విష్వక్=అన్నివైపుల వ్యాపించిన, తేజమ్ము=కాంతి, దిగంతరాళములు=దిక్కుల మధ్యన, కప్పన్=వ్యాపించగా, మూర్తి=నీ శరీరమును, కాన్పించి=చూపి, నీ=నీ వశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారము యొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్= ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** తల్లీ! చాముండా! చూపులను ముత్యాలసేసలుగా జల్లి మధుర కవితలను మాలికలుగా నీ కంఠమున దొడిగి చేతులు మోడ్చి వేడుకొను చున్నాను. దిగంతరాళములు కాంతులీనునట్లు నీ స్వరూప దర్శనము చేయించి ముక్తిద్వారమును నా కొఱకు ఉద్ఘాటించి పెట్టుము.

శ్లో॥ మోక్తుఙ్కామత కన్దళిమ్పగ భవన్మూర్తిన్ గనన్ గోరితిన్
రక్తిన్ దృక్ప్రసవాగ్రజాతరదనోద్రత్నాధరోష్ఠప్రభా
యుక్తర్ణస్మితవక్త్రచన్ద్రము సముద్యోతిమ్పగా వచ్చి నీ
ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. **21**

**ప్రతిపదార్థము :** మోక్తుంకామత=మోక్షవాంఛ, కందళింపగ=పిలకలు వేయగా, భవన్మూర్తిన్=నీ శరీరమును, కనన్గోరితిన్=చూడగోరితిని, రక్తిన్=ప్రేమతో, దృక్ప్రసవ=నేత్రపుష్పముల, అగ్ర=కొనలయందు, జాత=పుట్టినదియు, రదన=దంతములు అనే, ఉద్రత్న=గొప్ప రత్నములతో గూడినదియు, అధరోష్ఠ=క్రింది పెదవియొక్క, ప్రభా=కాంతితో, యుక్=కలసినదియు అగు, తర్ణస్మిత=చిన్న చిఱునవ్వుతో గూడిన, వక్త్రచంద్రము=ముఖచంద్రబింబము, సముద్యోతింపగా=ప్రకాశించగా, వచ్చి=ఏతెంచి, నీ=నీ వశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్కతల్పు=తలుపును,చాముండా=చండముండాసురులను చంపిన



5) ఉద్ఘాటయేత్కవాటన్తు-యథా కుఞ్చికయా గృహమ్।
కుణ్డలిన్యా తదా యోగీ-మోక్షద్వారం విభేదయేత్॥
– యోగచూడామణ్యుపనిషత్

అనగా తాళపు చెవితో గృహద్వారం తెఱచినట్లు కుండలినితో యోగి ముక్తిద్వారమును తెఱచికొనును.

కుండలిని మేల్కొంటేనే మన పూజలు, వ్రతాలు, జపాలు, ఉపాసనలు ఫలించునని మఱొక తంత్రం చెప్పింది.

"మూలపద్మే కుణ్డలినీ-యావన్నిద్రాయితా ప్రభో!
తావత్కిఞ్చిన్న సిధ్యేత-మన్త్రయన్త్రార్చనాదికమ్।
జాగర్తి యది సా దేవీ-బహుభిః పుణ్యసఞ్చయైః
తదా ప్రసాదమాయాతి-మన్త్రయన్త్రార్చనాదికమ్॥
– గౌతమీయతన్త్రమ్

కుండలిని మేల్కొనని వారి ఉపాసనలు పుణ్యఫలప్రదాలే కాని మోక్షప్రదాలు కావు. ఇట్టి పుణ్యములు ప్రోగుపడితేనే గాని కుండలిని జాగృతం కాదు. అది జాగృతం అయితే మొత్తం కర్మలు ఫలించినట్లే. మంత్రసిద్ధి, తంత్రసిద్ధి, యంత్రసిద్ధి వెంటనే జరుగును. ఈ ఉత్థానం అంత తేలికగా జరుగదు. ఎన్నో పరీక్షలు, శోధనలు, విఘ్నాలు, పతనాలు – పెద్ద వైకుంఠ పాళి.

మాయాశక్తి '2' రకాలు. 1) అవిద్య, 2) విద్య. మనం ముక్తి పొందడం అవిద్యకు ఇష్టము కాదట. అందుచేత అడుగడుగునా అవిద్యే అడ్డుపడుతుందట. తర్వాత ఎప్పటికో "విద్య ఉద్ధరిస్తుందట!' సుప్తకుండలిని అవిద్య. జాగృతకుండలిని – విద్య అని అనుకోవచ్చును.

"విద్యావిద్యేతి దేవ్యా ద్వే-రూపే జానీహి పార్థివ।
ఏకయా ముచ్యతే జన్తుః-అన్యయా బధ్యతే పునః॥
– దేవీ భాగవతమ్

దేవీ భాగవతములో ఉత్తరభాగంలో ఇలాంటి అంశమే ఉన్నది.

"ప్రాదుర్భూతం శక్తియుగ్మం-ప్రాణబుద్ధ్యధిదైవతమ్।
జీవానాం చైవ సర్వేషాం-నియన్తృప్రేరకం సదా।
యావత్తయోః ప్రసాదో న-తావన్మోక్షో హి దుర్లభః॥
- దేవీభాగవతమ్

ప్రాణదేవత మాయ, బుద్ధిదేవత దుర్గ. వీరిర్వురి అనుగ్రహం లేనంత వఱకు మోక్షం దుర్లభం. ఇందులో మొదటిది తొలగాలి. రెండవది కలగాలి. మొదటిది మనలను శోధించి ఏ మాత్రం అవకాశం ఉన్నా మళ్ళీ మోహంలోకి పడవేస్తుందట.

"జ్ఞానినామపి చేతాంసి దేవీ భగవతీ హి సా।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి॥"
- మార్కండేయపురాణమ్

కనుకనే ముసలి యోగినయినా, ఆజ్ఞాచక్రం వద్దకు చేరిన సందర్భంలో కామేశ్వరీదేవి కామపరీక్ష పెడ్తుందని సౌందర్యలహరి గూడా చెప్తున్నది. చూ॥

"నరం వర్షీయాంసం నయనవిరసం నర్మసు జడమ్..."

మా గురువుగారి జీవితంలో ఇట్టి "అగ్ని పరీక్ష" జరిగింది. అసలు మాయామిథ్యావాదంతో కుపితురాలయిన దేవిని అనుగ్రహింపజేసికొని యోగవిఘ్నం అధిగమించడానికే శంకరులు "సౌందర్యలహరిని" రచించినట్లు జనశ్రుతి. అలానే శ్రీ చెఱుకుపల్లి నరసింహశాస్త్రిగారను యోగిపుంగవుడు వ్రాసిన "స్వానుభవబోధిని" లోని ఒక పద్యమును బట్టి గూడా యోగులకు మాయతో విఘ్నం ఉంటుందని జీవుని ముక్తికి మాయ ఇష్టపడదని "కొడుకు సన్న్యాసాన్ని అంగీకరించని తల్లి" వంటిదని తెలుస్తుంది.

శ్లో॥ "ఇత్థం శక్తినిపాతమేత్య సపది శ్రీదేశికేన్ద్రాత్పరం
విస్మృత్యాఖిలబాహ్యకృత్యమనిశం పూర్ణాత్మభావే స్థితమ్।
జ్ఞాత్వా మాం విగతభ్రమం చ రుదతీ మాయా గతా శీఘ్రతస్తు
ఏతావత్సుకృతం పురాకృతమహో యద్వస్తి నోవేద్మహమ్॥
- ఒక గ్రంథ పీఠిక నుండి



గల, సుధాముక్=చంద్రుడు / సహస్రార చంద్రుడు అనే, తల్పంబున=శయ్య యందు, నిల్పి=నిలిపి, అర్చలు=పూజలు, ఇదుదున్=ఇచ్చెదను, ముందు= ముందుగా, అట్లు=ఆ విధంగా, చెల్లించి=నా సంకల్పము నెఱవేర్చి, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** దేవి సూర్యమండలమున పూజింపబడుట గూడా సంప్రదాయ సిద్ధము. భయంకర సంతాపకారణమైన సూర్యమండలమును అధిష్ఠించి 'సమ్రాట్' అనే పేరు పొందనేల?. నా హృదయాంబుజమధ్యములో నున్న అమృత కిరణునియందు నిన్ను నిల్పి పూజ చేసెదను. నా పూజ స్వీకరించి ముక్తిద్వారమును నాకై తెఱచి పెట్టుము.

శ్లో॥ **ద్రాక్తారాపతిశేఖరాఙ్ఘ్రిజలజధ్యానావధానాదితృ
ష్ణక్తాఞ్చద్ధృదయాళువౌ నను మనస్సక్తిన్ గటాక్షించి య
న్వ (వేస్వ)క్తాదాత్మ్యము నొన్దెదంచు గడు నభ్యర్థించి వాక్రుచ్చెదన్
ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **19**

**ప్రతిపదార్థము :** ద్రాక్=శీఘ్రముగా, తారాపతిశేఖర=చంద్రశేఖరుని యొక్క అంఘ్రిజలజ=పాదపద్మముల యొక్క, ధ్యాన=ధ్యానించుట, అవధాన=శ్రద్ధగా నుండుట యందలి, తృష్ణక్తా=తీవ్రవాంఛతో, అంచత్=ఒప్పుచున్న, హృదయాళువౌ=హృదయముగల వాడనగు, నను=నన్ను, మనస్సక్తిన్= ఆసక్తితో, కటాక్షించి=చూచి, అన్వక్=అనుకూలమయిన, (లేదా వే= వేగముగా, స్వక్=కౌగిలించుకొను) తాదాత్మ్యమున్= ఐక్యమును, ఒందెదంచు= పొందెదవనుచు, కడు=మిక్కిలి, అభ్యర్థించి= యాచించి, వాక్రుచ్చెదన్= పలికెదను. ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** అమ్మా! నేను చంద్రశేఖర పాదారవింద భజన వాంఛగలవాడను. నీవు అట్టిదానివి. కనుక నా మీద మనసుపెట్టి కటాక్షించి నాతో ఐక్యమును పొందుమని ప్రార్థించుచున్నాను. అమ్మా! ముక్తిద్వారమును తెఱువుము.

**తాత్పర్యము :** ఏదో తిండి తినుచూ పరలోకమునుపేక్షించి, రేయింబవళ్ళు తుచ్ఛ సంభాషణలతో కాలక్షేపము చేయకుండగ, భిన్నమయిన ఓంకార మార్గగతమయిన నీ పాదములను/స్థానమును పొందగోరిన బిడ్డను. కనుక తల్లీ! ముక్తిద్వారమును నాకోసము తెఱచి యుంచుము.

**శ్లో॥ రక్తిన్ నీపతి యన్తరాసవపరీరమ్భక్రియాలాలసా**
**ధుక్తారుణ్యవతిన్ నినున్ గలసి యెన్తో వేడ్క గర్మాటవీ**
**ధక్తోషమ్బిడ నీదు పాదముల చెన్తన్ దణ్డమర్పిన్తు నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 17**

**ప్రతిపదార్థము :** నీ పతి=నీ భర్త అయిన పరమశివుడు, రక్తిన్= అనురాగముతో, అంతరాసవ=సహస్రారసుధామండల మధ్యమున, పరీరంభక్రియా=శివశక్తి సమ్మేళనము అను సామరస్యక్రియయందలి, లాలసా=గొప్ప ఆశను, ధుక్=మఱింతగా పెంచెడు, తారుణ్యవతిన్= యౌవనముగల, నినున్=నిన్ను, కలసి=కలసి,ఎంతో=ఎంతో,వేడ్కన్=వేడుకతో,కర్మాటవీ=కర్మఫలారణ్యమును,ధక్=తగుల బెట్టు, తోషంబు=ఆనందమును, ఇడన్=ఇవ్వగా, నీదు=నీ యొక్క, పాదముల=పాదముల యొక్క, చెంతన్=సమీపమున, దండము= సాష్టాంగ దండ ప్రణామమును, అర్పింతు=అర్పించెదను. నీ=నీవశములో నున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క,తల్పు=తలుపును,చాముండా=చండముండాసురులనుచంపిన దానా!,జగత్=ప్రపంచమునకు,జీవనీ=బ్రతికించుదానా!,తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** అమ్మా! యోగసమాధిలో సహస్రారసుధామండలమధ్యమున నీవు పరమశివునితో కలసిన స్థితిలో నీ పాదములకు నా ప్రణామములను సమర్పించెదను. నీ ముక్తి ద్వారము తెఱవవలసినది.

**శ్లో॥ రుక్తీక్ష్ణమ్బగు సూర్యమణ్డలి సమారోహించి సమ్రాడ్రమా**
**భాక్తన్ శోషిలనేల? నాదు హృదయామ్బుస్సమ్భవాన్త స్సుధా**
**ముక్తల్పమ్బున నిల్పి యర్చలిడుదున్ మున్దట్లు చెల్లించి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 18**

**ప్రతిపదార్థము :** రుక్=కాంతిలో, తీక్ష్ణంబగు=తీవ్రమయిన, సూర్యమండలి=సూర్యమండలమున, సమారోహించి=ఎక్కి, సమ్రాడ్రమాభాక్తన్=సామ్రాజ్య లక్ష్మీయుతగా, శోషిలన్=శోషపడగా, ఏల=ఎందుకు, నాదు=నాయొక్క హృదయ=గుండె అను, అంభస్సంభవ=కమలము యొక్క, అంతః=లోపల



**దీని భావము :** శ్రీ నరసింహశాస్త్రిగారు తమ గురువు వద్ద శక్తిపాతము పొంది పూర్ణసమాధిలోనికి వెళ్ళి ఆత్మజ్ఞానులయినారట. దాంతో వారి మీద ఆశ వదలుకొన్న మాయాశక్తి ఏడుస్తూ తొలగిపోయినదట. ఇంత సుకృతము తనకు ఉందా? అని ఆయనే ఆశ్చర్యపడినారు.

ఈ కారణంగానే మోక్షార్థులకు దేవి లేదా దేవీరూపభేదమయిన విష్ణుప్రసాదము గాని అవసరము. "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్".

**అతస్సంసారనాశాయ సాక్షిణీమాత్మరూపిణీం।**
**ఆరాధయేత్పరాశక్తిం ప్రపఞ్చోల్లాసవర్జితామ్॥** – సూతసంహిత

ఈ విధంగా మోక్షార్థులకు ముక్తిద్వారకవాటములు తెఱవడం దేవి అధీనంలోని అనుగ్రహం. అందుకొఱకు ఆమెనే ఆరాధించాలని సూతసంహితాది గ్రంథాలు చెప్పుతున్నాయి. ఇంత అర్థం మనసులో పెట్టుకొని శ్రీ పాపయారాధ్యులవారు ఈ 'స్తుతిని' రచించారు. ఇటువంటి భావపూర్ణమయిన శీర్షిక కొఱకు ఆమాత్రం క్లిష్టత అనుభవించడం దండుగ కాదు. అయితే కొన్ని వ్యాకరణదోషాలు గూడా ఉన్నవి. దేవీ భాగవత పీఠికలో భమిడిపాటివారు చెప్పినట్లు "నిరంకుశాః కవయః" అనుకోవడం మంచిది. మహాభక్తుడయిన కవి కనుక భక్తిప్రవాహంలో కొట్టుకొని వచ్చిన యీ డిండీరాలను ఆర్షప్రయోగాలుగా అనుభవించడం మంచిది. చెళ్ళపిళ్ళవారు చెప్పినట్లు ఇందులో లేఖకాది ప్రమాదాలవలన కొన్ని అర్థంకాని, లేదా అర్థం లేదనిపించే వాక్యఖండాలు ఉన్నాయి. దీనికి ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాయమని శ్రీ రావిమోహనరావు (రా।మో।రా)గారు నన్ను కోరారు. సవరింప సాధ్యము కాదని శ్రీ చెళ్ళపిళ్ళవారే వదలిన ఘట్టముకు నేను మాత్రము ప్రతిపదార్థముల నెట్లు వ్రాయగలను? కాని ప్రతిపదార్థము వ్రాయవలె గదా! ఏదోవిధంగా అర్థం తెచ్చికొని చదవాలి గాని నిరర్థంగా చదివితే వ్యర్థం కదా! అందుకని నాకర్థమయిన విధంగా కొన్ని మార్పులు చేశాను. చేసే సందర్భంలో చెళ్ళపిళ్ళవారి మాటలను గుర్తు తెచ్చుకొన్నాను.

"సంస్కర్తృత్వమనగా గ్రంథకర్త హృదయము కనిపెట్టుటయే గాని తన యిచ్చ వచ్చినట్లెల్ల మార్పు చేయుట గాదని యథాశ్రుత పాఠములనట్లే యుంచితిని. స్థితస్య గతిః చింతనీయా – చెళ్ళపిళ్ళ.

అయితే ప్రతిపదార్థం వ్రాయాలంటే అర్థందొఅకని పాఠములనట్లే యుంచుట సాధ్యము కాదు గదా! అందువలన భవిష్యత్తులో ఏ బుద్ధికుశలు డయినా అర్థము చెప్పగలిగేందుకు వీలుగా అసలు పాఠమును, నేను చేసిన మార్పులను క్రింద పట్టికారూపములో ఇస్తున్నాను. మార్చిన వాటికి క్రింద – గీత పెట్టాను.

| వ. సం. | పద్య సంఖ్య | పంక్తి సంఖ్య | అసలు పాఠం | మార్పు |
|---|---|---|---|---|
| 1 | 3 | 2 | శుద్ధక్రియాద్రాక్తా | ద్యా |
| 2 | 8 | 3 | విస్రత | విస్రస్త |
| 3 | 11 | 2 | నిర్ముక్తాప్రా | ప్రో |
| 4 | 15 | 2 | గృతమక్షికా | ఘృత |
| 5 | 18 | 1 | స్త్రామ్రాద్రమా | స |
| | 18 | 2 | హృదయాంభస్తంభవంత | స్తం-వ్రా |
| 6 | 19 | 2-3 | వేస్వక్తా | యన్వక్తా |
| 7 | 20 | 1 | స్రుక్కులాకంధ | స్ర త |
| 8 | 21 | 2 | రక్త దృక్ప్ర | రక్తిం |
| | 21 | 2 | సదనో | రదనో |
| 9 | 22 | 1 | స్వికా | స్మికా |
| | 22 | 1 | సునాభీలోల | లీ |
| 10 | 23 | 2 | ముక్తాస్సర | ముక్తాన |
| 11 | 26 | 3 | ముక్తుల్ | ముక్తల్ |
| 12 | 27 | 2 | క్తామోదర | క్తాబ్జోదర |
| 13 | 28 | 3 | మమున్ | మిమున్ |
| 14 | 29 | 4 | ప్రాప్త | ప్రాప్తి |



**ప్రతిపదార్థము :** రుక్=కోరికలకు సంబంధమయిన, తాపానల=సంతాపాగ్ని వలన బుట్టిన, వేదనా=బాధచేత, శిథిలిత=శిథిలము చేయబడిన, ఉద్రుక్= మిక్కిలి రోగం చెందిన, మాంస=మాంసముచే, మేదః=క్రొవ్వుచేత, వసా=వస చేత, తిక్తుండన్=చేదెక్కినవాడను, ఘృత=నేతిలోబడిన, మక్షికాకృతి=ఈగతో సమానముగా, నిరర్థీభూతమౌ=నిరర్థకమయిన, గాత్రము=శరీరము, ఈదృక్తా= ఇట్టి లక్షణములతో, గ్రంథిల=ముడులు గట్టిన, జన్మలన్=జన్మలతో, విసివి= విసుగుజెంది, తల్లీ!=మాతా, కావుము=రక్షింపుము, అంటిన్ గదా!=అంటిని గదా!, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** కోరికల వలన వచ్చిన సంతాపములతో ఉడికి శిథిలమయిన చేదు మాంసము బొమ్మ యీ శరీరము. నేతిలో బడిన యీగవలె ఈ శరీరము వ్యర్థము అయినది. జన్మలన్నీ ఇదే సమస్య. ఇవే చిక్కుముడులు. తల్లీ, విసిగి వేసారి నన్ను రక్షింపుమని నిన్ను గోరితినిగదా! ముక్తిద్వారము తలుపు తీయుము!

**శ్లో॥** **సక్తుస్వాదనకాలయాపనముపేక్షం జేసి రేయున్ బవల్**
**న్యక్తుచ్ఛోక్తుల త్రోవబోవక పరానన్దస్వరూపమ్బు ప్ర**
**త్యక్తారాధ్వగమైన నీ పదమునందన్ గోరితిన్ గాన నీ**
**ముక్తి ద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **16**

**ప్రతిపదార్థము :** ఉపేక్షన్=తిరస్కారముతో, సక్తు=సక్తుపిండిజావ యొక్క, స్వాదన=రుచిచూచుటతో, కాలయాపనము=కాలక్షేపము, చేసి=చేసి, రేయున్= రాత్రియు, పవల్=పగలున్ను, న్యక్=అధమమయిన, తుచ్ఛ=వ్యర్థమయిన, ఉక్తుల=మాటల యొక్క, త్రోవన్=త్రోవన, పోవక=పోక, పర=పరమమయిన, ఆనందస్వరూపంబు=ఆనంద స్వరూపమయిన, ప్రత్యక్=ప్రపంచ భిన్నమయిన, తార=ఉన్నతమయిన, అధ్వగమైన=మార్గమునందున్న, నీ పదమున్=నీ పాదమును, అందన్ గోరితిన్=అందగోరితిని. కాన=కనుక, నీ=నీవశములో నున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** ముక్కెరముత్యపుకాంతితో మఱింత తెల్లనయిన దరహాస చంద్రికలతో నీ భర్త అయిన పరమేశ్వరుని వద్ద మా తాపత్రయమును మనవి చేసి ఆయనకు మాపై వాత్సల్యము పుట్టించి వేదతుల్యమయిన నూపుర ధ్వనులతో నాదమయివై వచ్చి ముక్తిద్వారము తెఱచి మమ్ము పరమేశ్వరునితో కలుపుము.

**శ్లో॥** **వ్యక్తావ్యక్తజగద్విలక్షణము నీ వాస్తవ్యమంచున్ బృహ**
**త్సూక్తాళుల్ మొఱవెట్టినట్టు చిదచిత్సూక్ష్మాంత వీవౌదు, ధీ**
**వ్యక్తుల్మాదృశులా? కనన్ గరుణ నాపై సుంతయున్తేని నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **14**

**ప్రతిపదార్థము :** నీ=నీయొక్క, వాస్తవ్యము=నివాసము, వ్యక్త=స్పష్టమయిన, అవ్యక్త=అస్పష్టమయిన, జగత్=ప్రపంచమునకన్న, విలక్షణము=భిన్నమయి నది, అంచున్=అనుచు, బృహత్సూక్తాళుల్=బహ్వృచము మొ॥ సూక్తములు, మెఱవెట్టినట్లు=ఘోషపెట్టిన చందముగా, ఈవు=నీవు, చిత్=జ్ఞానతత్త్వము, అచిత్=జడతత్వము, సూక్ష్మ=ఈశ్వరతత్వములకు, అంతవు=చివఱిదానవు ఔదు=అగుదువు,కనన్=నిన్నుతెలియుటకు, ధీవ్యక్తుల్=పరిణతబుద్ధులు, మాదృ శులా!=మావంటివారా?, నాపై=నా మీద, కరుణ=దయ, సుంత=కొంచెము, ఉంతేని=ఉంచేపక్షమున, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము= మోక్ష ద్వారముయొక్కతల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపిన దానా!,జగత్=ప్రపంచమునకు,జీవనీ=బ్రతికించుదానా!,తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** నీ స్వరూపము ఈ ప్రపంచమునకు భిన్నము. నీవు చిత్తు అచిత్తు ఈశ్వరతత్త్వములకన్న అతీతమయిన దానివి. బహ్వృచ మొదలగు సూక్తములు నీ స్వరూపమును గూర్చి ఇట్లే ఘోషించినవి. ఇట్టి నీ పరతత్త్వమును తెలియగలిగే బుద్ధి పరిపాకముగలవారము మేమా? కనుక నీకు నాపైన ఏదయినా కాస్త దయ ఉంటే ముక్తిద్వారమును తెఱచి నన్ను స్వాగతింపుము.

**శ్లో॥** **రుక్తాపానలవేదనాశిథిలితోద్రుజ్మాంస మేదోవసా**
**తిక్తుణ్ణన్ ఘృతమక్షికాకృతి నిరర్థీభూతమౌ గాత్ర మీ**
**దృక్తాగ్రన్థిల జన్మలన్ విసివి తల్లీ కావుమంటిన్ గదా!**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **15**



ఈ మార్పులన్నీ తెలిసి చేసినవి కాకపోవచ్చును. తెలియక తెలిసి నంతలో చేసినవి. సార్థకంగా చదవాలని చేసిన పని. శిల దేవుడయినపుడు ఈ మార్పులలో భావన చేసిన యీ పద్యాలు ఈ అర్థం గలవి కాకపోవు. ఇంతకన్న చక్కని అర్థం యథాశ్రుత పాఠాలకే సంతృప్తికరంగా చెప్పగలిగే ధీమంతులకు ప్రత్యర్థిని కాలేను. భుక్తి ద్వారాల కోసం భక్తిని ఉపయోగించే రోజులివి. ముక్తిద్వారం కోసం భక్తిని వినియోగించే రోజులవి. పేరులో తప్ప ఇంకెక్కడా పాపస్థితి లేని పాపయారాధ్యుల పద్యాలతో పరవశించిన హృదయం నుంచి నేటి పరిస్థితి, పరస్థితుల పట్ల ఏహ్యాభావంతో నాకు కొన్ని పద్యాలు ఆశువుగా దొర్లినవి. ప్రాస్తావికంగా వాటిని మీముందు 'విందు' చేయుచున్నాను. వీటికి 12వ పద్యం ప్రేరకం.

**1)** **"భుక్తిద్వారము తల్పు దీయుమని భోర్భోరంచు శోకించుచున్**
**శక్తిన్ రాష్ట్రమునంత ముష్టికొఱకై సాధించు "భుక్తా" వళుల్**
**రక్తిన్ బొందెదు నిట్టి కాలమున వైరాగ్యంబు సత్యంబుగా**
**ముక్తిద్వారపు తల్పు దీయుమని చాముండా ఎవండేడ్చెడిన్".**

**2)** **శక్తీ! దేశములెల్ల తిర్గి గడపల్ చందాలకై దాటుచున్**
**సక్తుల్బెంచి టికెట్లు చింపి ధనమున్ సాధించు పీనాశికిన్**
**భుక్తిద్వారము లెన్నియేని తెఱవన్ పుణ్యంబెయౌ గాని నీ**
**ముక్తిద్వారము తీసి పొట్టపయినే మూర్ఖంబుగా కొట్టకే.**

**3)** **భక్తిన్నిన్ను శ్రయించు పామరులనుత్పాదించినావప్పుడే**
**భుక్తిన్నిన్ను గ్రయించు పండితులనున్ పుట్టించినావిప్డు నీ**
**సక్తుల్ శక్తులు భుక్తిభక్తులును విశ్వప్రేమ లేతీఱుగా**
**వ్యక్తంబౌనో యెఱుంగలేనియనదన్ వ్యాఖ్యానముల్ జేసికో.**

**4)** **భుక్తిద్వారము నింపుకొంటయును నీ ముష్టింపచత్వమ్ములున్**
**ముక్తిద్వారములన్నియున్ దడవుటల్ మోక్షంబులిప్పించుటల్**
**భక్తిగ్రంథములమ్ముటల్ ఛలముగా పైసల్వసూల్జేయుటల్**
**ముక్తిద్వారములివ్వి నీవు తెఱవన్ మోజున్నచో రాగదే.**

**5)** **ముక్తిద్వారపు తల్పు దీసెదవొ దంభున్ జూచి మూయింతువో**
**భక్తిన్ దానిని గూర్చి ఏడ్చుటకు నే పాపయ్యలున్ లేరు, నీ**

శక్తిన్ జూపి బిగించుకోవె తలుపుల్ సంపత్తు రాకుండునే,
వ్యక్తిత్వంబెటులున్న నేమి యొఱగున్ వ్యాపారముంబెంచవే.

6) లాకెట్టుల్వడపప్పు కొబ్బరియు మాలల్ వస్త్రముల్టిక్కెటుల్
మీకున్ మీకని పంచి దండుకొనుచున్ మీకంచు నాకంచు మా
ఱాకుల్వేసిన డబ్బు పంచికొనుచున్ న్యాయాది నోటీసులున్
బాకుల్దూసెడి తెంపరు ల్గద! మహాభక్తాగ్రణుల్నీదయన్.

7) ధిక్తాయోగ్యులనొత్తిపల్కనిక నాదిక్కైన నిన్నమ్మి నా
ప్రాక్తత్వంబును పొందగోరితిని విశ్వప్రేమతో నుండెదన్
ధ్రుక్తుద్రుత్తుల జేరనీయకుము వాగ్ఘోషంబులన్గద్గి యా
ముక్తిద్వారపు తల్పుతీయగదె చాముండా జగజ్జీవనీ.

8) సక్తిన్ జేసితివట్టి "దబ్బుఅల" సంసారమ్మునన్ గొందఱన్
ముక్తిన్ గోరెడు మూర్ఖ జేసితివి "రామోరా" నిదేమర్మమో
రక్తిన్ స్వార్థమువీడి యిట్లు జననీ! గ్రంథమ్ములన్ వేసె, నీ
ముక్తిద్వారము యోగ్యకాలమున నీ పుణ్యాత్మకున్ దీయవే.

9) శక్తిన్ దేశము తిర్గలేక జననీ సంసక్తి హేరంబు స
ద్యుక్తిన్ నీదు పదప్రదక్షిణలతో యోగించుచున్నాడ, నీ
రక్తిన్ చూపుచు నన్ను గూడ దయతో రానున్న కాలంబులో
ముక్తిద్వారపు తల్పు తీసి యొడిలో బోర్లించి జోకొట్టుమా.

10) ముక్తిక్షేత్రపు ప్రెస్సు పెట్టికొని కంప్యూటర్లు పెట్టించికో
ముక్తి గ్రంథములచ్చుటే ప్రచురతన్ ముద్రించు "మా జంట" యో
శక్తీ! యిక్కడ మా "దుబార పనికిన్" సంతుష్టులెవ్వారు? నీ
ముక్తిద్వారపు తల్పు తీయగదె! రామోరాకు, నాకున్ దగన్.

ఇట్లు

మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి,
సంస్కృతాధ్యాపకుడు,
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల,
తిమ్మసముద్రం



**ప్రతిపదార్థము :** భక్తాదుల్=భక్తులు మొ॥వారు, ధనధాన్యసంపదలన్=ధనమును, ధాన్యమును, సంపదలను, అభ్యర్థింతురే=యాచింతురా?, అట్లు=ఆ విధముగా, నీ=నీయొక్క, భక్తిన్=భక్తిని, కోరుచునున్న=కోరుచున్న, నాకు=నాకు, ఇతరధా=మఱొక రకముగా, ప్రాప్తవ్యము=పొందదగినది, ఇంకన్=ఇంకను, ఏది=ఏమున్నది, నీ=నీయొక్క, దృక్తారా=నక్షత్రముల వంటి నేత్రముల యొక్క/నేత్రముల యొక్క ప్రసర=ప్రసారముల యొక్క ప్రతాపముల=ప్రతాపముల చేత, పాత్రీభూతునిన్=యోగ్యునిగా, చేసి=చేసి, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్= ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** అమ్మా! నిజమయిన భక్తులు నీనుంచి భక్తిని కోరుదురు గాని భుక్తిని కోరరు. ధనధాన్యసంపదలు కోరరు. నేను నీ భక్తినే కోరుచున్నాను. ముక్తినే గోరుచున్నాను. భుక్తిని కాదు. నాలో యోగ్యత లేకపోయినా నీ కటాక్ష వీక్షణములతో నన్ను యోగ్యునిగా జేసి నీ ముక్తిద్వారము తెఱచి పెట్టుము.

శ్లో॥ ముక్తాపాణ్డురహాసచన్ద్రికలు కెమ్మోవిన్ గుబాళిమ్ప మా
దృక్తాపత్రయి విన్నవించి పతి కెన్తే ప్రేమ బుట్టించి ప్రా
గుక్తాళీ చరణాఙ్గదారవసముద్ఘోషాఙ్గివై వచ్చి నీ
ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. **13**

**ప్రతిపదార్థము :** ముక్తా=ముత్యము వలె లేదా ముక్కెరలోని ముత్తెము చేత, పాండుర=తెల్లని, హాసచంద్రికలు=నవ్వులు అనే వెన్నెలలు, కెమ్మోవిన్=ఎఱ్ఱని అధరముపై, గుబాళింప=పరిమళింపగా, మాదృక్=మావంటి బిడ్డల యొక్క తాపత్రయి=తాపత్రయమును, విన్నవించి=మనవి చేసి, పతికి=భర్తకు, ఎంతేన్=ఎంతో, ప్రేమ=వాత్సల్యమును, పుట్టించి=మాపైన కలిగించి, ప్రాగుక్త=ప్రాబలుకులయిన వేదములకు, ఆళీ=మిత్రులయిన, చరణాంగదారవ=అందెల చప్పుడుతో, సముద్ఘోషాంగివై=నాదశరీరవై, వచ్చి=మా వద్దకు వచ్చి, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

పోయి "బురద బురదగా" అయినది. నీ కటాక్ష వీక్షణ లహరీ జలముతో దాని బురదను కడిగి, నీ దాస్యము అను శిక్ష వేసి నేర్పి బాగుచేసి నాకు నీ ముక్తిద్వారకవాటములను తెఱచి స్వాగతము పలుకుము.

**శ్లో॥ శక్తుల్ దస్సియు నిన్ద్రియావళి దురాశా పాశసంయుక్తి ని**
**ర్ముక్తాపోవ్రజమట్ల యాత్మ విషయామోదామ్బుధిన్ మున్గె నే.**
**యుక్తింజేసి తరిమ్పఁజేసెదవొకో, చిత్తమ్బు నాభాగ్యమై**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ॥ 11**

ప్రతిపదార్థము : ఇంద్రియావళి=నా ఇంద్రియసమూహము, శక్తుల్=సామర్థ్యములు, దస్సియు=వార్ధకముచేత తగ్గియు, దురాశా=దురాశ అనెడు, పాశ=పాశము యొక్క, సంయుక్తి=సంయోగమునందుండియు, నిర్ముక్త=విడువబడిన, ఆపోవ్రజమట్ల=నీటి ప్రవాహమువలెనే, ఆత్మ=తమ యొక్క, విషయ=విషయముల యొక్క, ఆమోద=సుఖములనెడు, అంబుధిన్=సముద్రమునందు, మున్గెన్=మునిగెను. చిత్తంబు=నా మనస్సును, ఏ యుక్తింజేసి=ఏ ఉపాయముతో, తరింపజేసెదవొకో=తరింపజేసెదవో కదా? నా భాగ్యమై=నా అదృష్టదేవతవై, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్= ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** అమ్మా! నా యింద్రియావళి వార్ధకము చేత దస్సిపోయినది. అయినా అది దురాశాపాశములో చిక్కుకొని గూడా, అడ్డుకట్ట తొలగిన జలప్రవాహమువలె తమ విషయానందసముద్రములోనికి పరుగులు పెట్టుచున్నది. ఈ పరిస్థితిలో ఇంద్రియవశమయిన నా మనస్సును ఎలా తరింపచేసెదవో నీ చిత్తం. నా అదృష్టదేవతవై ముక్తిద్వారకవాటములను తెఱచి స్వాగతము పలుకుము.

**శ్లో॥ భక్తాదుల్ ధనధాన్యసమ్పదల నభ్యర్థిన్తురే? యట్లు, నీ**
**భక్తింగోరుచునున్న నాకితరధా ప్రాప్తవ్య మింకేది? నీ**
**దృక్తారాప్రసర ప్రతాపముల పాత్రీభూతునిం జేసి, నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 12**





శ్రీః

# ముక్తిద్వార స్తవరత్నరాజము

## "ఉద్ఘాటనీ" వ్యాఖ్య

**శ్లో॥ భక్తత్రాణధురీణమౌగద భవత్స్వాన్తమ్బు వేదాన్తని**
**ర్ణిక్తం బీమహిమమ్బటంచు గురు నిర్ణీతిన్మదిన్నమ్మి శా**
**స్త్రోక్తాచారపరుండనైతి, త్రివిధవ్యూహాన్తమైనట్టి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 1**

ప్రతిపదార్థము : భవత్=నీ, స్వాంతంబు=మనస్సు, భక్త=భక్తుల యొక్క త్రాణ=రక్షించుట యందు, ధురీణము=సమర్థమయినది, ఔగద=అవును గదా!, ఈ మహిమంబు=ఈ మహిమ, వేదాంత=వేదాంతములయందు, నిర్ణిక్తంబు=నిశ్చయింపబడిన శోధిత విషయము, అటంచు=అని అనుకొనుచు, గురు=పెద్దల యొక్క, నిర్ణీతిన్=నిశ్చయమును, మదిన్=మనస్సులో, నమ్మి=నమ్మి, శాస్త్ర=శాస్త్రములయందు, ఉక్త=చెప్పబడిన, ఆచార=ఆచారములందు, పరుండను=ఆసక్తిగలవాడను, ఐతి=అయినాను. త్రివిధ=3 రకములయిన, వ్యూహ=స్థూల సూక్ష్మ కారణ శరీరరూప వ్యూహత్రయమునకు, అంతమైనట్టి=చివఱిదయిన/నాశకమయిన, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారము యొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా! (అందువలన ఈ పేరు వచ్చింది), జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె= తెఱవరాదా!

**తాత్పర్యము :** చాముండాదేవీ, జగజ్జీవనీ, నీ మనస్సు భక్త రక్షణ సమర్థమయినదని, నీ మహిమ వేదాంత అనగా ఉపనిషత్తులచే శోధింబడినదని పెద్దలు చెప్పిన మాటలను నమ్మి శాస్త్రోక్తమయిన ఆచారములను పాటించుచుంటిని. స్థూల సూక్ష్మ కారణ శరీరములు, అతీతమయిన నీ ముక్తి ద్వారము యొక్క తల్పును తెఱచియుంచుము.

**శ్లో॥ భోక్తవ్యమ్బు శివప్రసాదమని సమ్బోధించు వారిన్ సదా**
**వక్తవ్యమ్బు శివాఖ్యమన్త్రమని సమ్భావించువారిన్ మనో**
**వాక్తత్త్వైక్యనిరూఢి నీవయని సేవావృత్తి నున్నాడ నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 2**

**ప్రతిపదార్థము :** భోక్తవ్యంబు=తినదగినది, శివప్రసాదమని=శివుని ప్రసాదమని, సంబోధించువారిన్=బోధించు గురువులను, సదా=నిరంతరము, వక్తవ్యంబు=పలుకదగినది, శివాఖ్య='శివ' అను, మంత్రమని=మంత్రము అని, సంభావించువారిన్=భావించునట్టి భక్తులను, మనోవాక్త్వైక్యనిరూఢి=మనస్సు వాక్కులు ఐక్యమయిన నిశ్చయముతో, "నీవయని"=నీ స్వరూపములేయని, సేవావృత్తిన్=సేవాకార్యమున, ఉన్నాడ=ఉన్నవాడను, నీ=నీవశములోనున్న, ముక్తి ద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** చాముండికా దేవీ! జగజ్జీవనీ! శివప్రసాదమే అనుభవింపవలెనని, శివనామ మంత్రమే జపించవలెనని భావించు భక్తశిఖామణులను నీ స్వరూపములుగానే త్రికరణపూర్వకముగా నిశ్చయించి సేవించుచున్నాను. తల్లీ నీ ముక్తిద్వారకవాటములను నాకోసము తెఱచియుంచుము.

**శ్లో॥** **శాక్తాచారధురీణ చాక్రికసమర్చాసిద్ధ శుద్ధక్రియా**
**ద్యాక్తాస్వాదనమోదనప్రవణవిద్యావిత్ప్రసంవేద్యతా**
**భాక్తల్పాన్తికతాళవృన్తకలనా వ్యాపారినై నిల్తు నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ.** **3**

**ప్రతిపదార్థము :** శాక్త=శక్తి సంబంధమయిన, ఆచార=ఆచారములయందు, ధురీణ=సమర్థుడయిన, చాక్రిక=శ్రీ చక్రసంబంధమయిన, సమర్చా=అర్చన యందు, సిద్ధ=సిద్ధులయిన, శుద్ధక్రియాది=శుద్ధ కార్యములు మొ॥ వానిచే, ఆక్త=పొందబడిన, ఆస్వాదన=ఆస్వాదించుట, మోదన=ఆనందించుట యందు, ప్రవణ=ఆసక్తికల, విద్యావిత్=శ్రీ విద్యావేత్తలచేత, ప్రసంవేద్యతా= తెలియదగినతనమును, భాక్=పొందిన, తల్ప=పంచ బ్రహ్మమంచము యొక్క అంతిక=సమీపమున, తాళవృంత=తాటియాకుల విసనకర్ర యొక్క, కలనా=వీచుటచేత, వ్యాపారినై=పనికలవాడనై, నిల్తున్=నిల్చెదను. నీ= నీ వశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారము యొక్క తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!



ఏఱులయి=నదులయి, పాఱన్=ప్రవహింపగా, చండముండాదులౌ=చండుడు ముండుడు మొ॥ అగు, నక్తంచారుల=రాక్షసులను, కూల్చి=చంపి, కాసిలితివి= శ్రమపడితివి. ఆనందించి=నీ విజయమునకు ఆనందపడి, అస్మత్=మా యొక్క, మనః=మనస్సు యొక్క, ప్రాక్తాపంబులు=పూర్వసంతాపములు, తీఱ=తీఱిపోవునట్లు, పాదములు=నీ పాదములను, సంవాహింతు=ఒత్తెదను!, మేలెంచి=నాకు శ్రేయస్సును తలచి, నీ=నీ వశములోనున్న, ముక్తిద్వారము =మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె= తెఱవరాదా!

**తాత్పర్యము :** రక్తనదులు పారించి చండముండాది రాక్షసులను సంహరించి ఎంతో శ్రమపడితివి. అందుకు ఆనందపడిన నేను నా మనస్తాపములు గూడా అట్లే తీఱవలయునని ఆశించి నీ పాదసేవ చేయవచ్చితిని. నాకు శ్రేయస్సును చేకూర్చుటకు ముక్తిద్వారమును తెఱచి యుంచుము.

**శ్లో॥** **సక్తమ్బయ్యె మదీయచిత్తము బృహత్సంసార పంకాబ్ధి న**
**వ్యక్తాతీత భవత్కటాక్షలహరీ వాఃపూర సంస్ఫీతి చే.**
**సిక్తమ్బౌనటులార్చి కిఙ్కరతచే శిక్షావిధింగూర్చి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ॥** **10**

**ప్రతిపదార్థము :** మదీయచిత్తము=నా మనస్సు, బృహత్=పెద్ద, సంసార= సంసారమనెడు, పంకాబ్ధిన్=బురదసముద్రమునందు, సక్తంబయ్యె= దిగబడి పోయినది, అవ్యక్త=అజ్ఞాతమయిన, అతీత=లోకాతీతమయిన, భవత్=నీ, కటాక్ష=అపాంగ వీక్షణముల యొక్క, లహరీ=ప్రవాహము అనే, వాఃపూర= జలప్రవాహము యొక్క, సంస్ఫీతిచే=విస్తృతిచే, సిక్తంబౌనటులు=తడిసిపోవు నట్లుగా, అర్చి=చేసి, కింకరతచే=దాస్యము చేత, శిక్షావిధిం గూర్చి= శిక్ష వేసి నేర్పి, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్= ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** తల్లీ! నా మనస్సు సంసార పంక మహాసముద్రమున దిగబడి

వక్తృత్వం బెడలించి విస్రస తనూభారమ్ముగా జొచ్చె నీ
ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ॥ 8

**ప్రతిపదార్థము :** వక్తుంకామత=చెప్పవలెననే కోరికతో, తావకీన=నీకు సంబంధించిన, విజయ=విజయ సంబంధమయిన, వ్యాపార=క్రియల యొక్క, తారావళుల్=27 పద్యములను లేదా నక్షత్ర సమూహములను లేదా, ముత్యాల సరాలను, వాక్=వాక్కులనెడు, తంతుచ్ఛట=దారపుటుండతో, గ్రుచ్చి=దండగా గట్టి, దిగ్గజ=దిగ్గజముల యొక్క, గతి=నడకవంటి నడక యొక్క, ప్రారంభముల్=ప్రారంభములను, చేతునా=చేసెదనా?, విస్రస=ముసలి తనము, నా=నాయొక్క, వక్తృత్వంబు=వాచక శక్తిని, ఎడలించి=పోగొట్టి, తనూభారంబు=శరీరభారముగా, కాజొచ్చె=కాబోవుచున్నది, నీ=నీ వశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** నీ విజయవ్యాపారములను తారావళిగా నా వాక్యముతో గూర్చి దిగ్గజగతి ప్రారంభములు సేయదలచితిని. కాని వార్ధకము నా వాచక శక్తిని తగ్గించినది. శరీరమునకు భారమయినది. తల్లీ! ముక్తిద్వారము తల్పు తీయవలసినది. దిగ్గజగతి ప్రారంభములనగా 4 దిగ్గజములు లక్ష్మిపై నీరు చల్లినట్లు తాను ముత్యముల వంటి శ్లోకాలతో ఆమెను స్తుతించగోరటమని యూహ. చూ॥

"కాన్త్యా కాఞ్చన సన్నిభాం హిమగిరి ప్రఖ్యాం చతుర్భిర్గజైః
హస్తోత్క్షిప్త హిరణ్మయామృత ఘటైః ఆసిచ్యమానాం శ్రియమ్"
– సౌభాగ్య భాస్కరమ్

**శ్లో॥ రక్తస్రోతములుర్విఁనేఁటులయి పాఱన్ జణ్డముణ్డాదులౌ**
**నక్తంచారుల గూల్చి గాసిలితి వానన్దించి యస్మన్మనః**
**ప్రాక్తాపమ్ములు దీఱ బాదములు సంవాహిస్తు మేలెంచి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ॥ 9**

**ప్రతిపదార్థము :** ఉర్విన్=నేలమీద, రక్తస్రోతములు=రక్త ప్రవాహములు,



**తాత్పర్యము :** శాక్తతంత్రధర్మములు శ్రీ చక్రార్చన, శుద్ధక్రియ మొ॥ వాటివలన జ్ఞానము, ఆనందము మొ॥ అనుభవించు శ్రీవిద్యావేత్తలకు మాత్రమే తెలియదగిన నీ పంచబ్రహ్మమంచమువద్ద నీకు వీవన వేయుచుండవలెనని కోరుచున్నాను. తల్లీ! ముక్తిద్వారము తల్పు దీయగదే!

**శ్లో॥ రక్తామ్భోరుహ గర్భసోదర కళారారజ్యమానారుణా**
**లక్తాఙ్కమ్బగు నీ పదద్వయము ఫాలస్థాయిగా జేసి య**
**ర్వాక్తత్త్వమ్ముల మీఱగోరితి గృపాపాథోనిధానమ్బవై**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 4**

**ప్రతిపదార్థము :** రక్త=ఎఱ్ఱని, అంభోరుహ=పద్మముల యొక్క, గర్భ=లోపలి భాగమునకు, సోదర=సహోదరమయిన, కలా=శోభతో, రారజ్యమాన=ఎఱ్ఱబడు చున్న, అరుణ=ఎఱ్ఱని, అలక్తాంకంబగు=లాక్షారసలక్షణముగల, నీ=నీ, పదద్వయము=పాదద్వయమును, ఫాలస్థాయిగా=నుదుట నిలిచినదానినిగా, చేసి=చేసి, అర్వాక్తత్త్వంబుల=అధమ తత్త్వములను, మీఱగోరితిని=దాటిపోవ గోరితిని, కృపా=దయయొక్క, పాథోనిధానంబవై=సముద్రానివై, ముక్తి ద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** ఎఱ్ఱదామర పూల గర్భమువలె కోమలమైన ఎఱ్ఱని లాక్షారసాంకితమయిన నీ పాదద్వయమును నా నుదుట ధరించి విషయములు మొ॥ అధమ తత్త్వములను దాటదలచితిని. అమ్మా! దయాసముద్రురాలవై నీ ముక్తి ద్వారమును నా కోసము తెఱవవలసినది. మూలాధారము రక్తపద్మమని యోగశాస్త్రము.

**శ్లో॥ శుక్తిభ్రాన్తుడు రౌప్యనిశ్చయము గాంచుం గాదె యప్పోల్కి స**
**మ్యక్తత్త్వానుభూతి సర్వసురులం బ్రార్థించు మేలెద్ది శ్రీ**
**వాక్తన్వఙ్గులచే బనుల్గాను మహోవాల్లభ్యమేగణ్టి నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 5**

**ప్రతిపదార్థము :** శుక్తి=ముత్యపుచిప్పవలన, భ్రాంతుడు=భ్రాంతి పడిన

మానవుడు, రౌప్య=అది వెండియను, నిశ్చయము=నిర్ణయమును, కాంచుంగాదె =పొందును గదా!, అప్పోల్కి=ఆ విధముగా, సమ్యక్తత్త్వానుభూతి=అసలయిన తత్త్వానుభవము లేకపోవుట వలన, సర్వసురులన్=సమస్త దేవతలను ప్రార్థించు=కోరుకొను, మేలు=క్షేమము, ఎద్ది=ఏది గలదు. శ్రీ=లక్ష్మీ అను, వాక్=సరస్వతి అను, తన్వంగులచే=దేవతాస్త్రీలచేత, పనుల్గొను=సేవలు పొందు, మహావాల్లభ్యము=నీ మహైశ్వర్యమును, ఏన్=నేను, కంటిన్=చూచితిని, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము=మోక్షద్వారము యొక్క తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!

**తాత్పర్యము :** ముత్యపుచిప్పను చూచి దాని తెల్లని మెఱుపులు గమనించి అది వెండి అనుకొన్నట్లు అసలయిన దైవతత్త్వము తెలియక కనబడిన దేవతలనెల్ల నీవనుకొని ప్రార్థించిన భ్రాంతునకు శ్రేయము రాదు. లక్ష్మీ సరస్వతుల చేత గూడ సేవలు చేయించుకొను నీ ఐశ్వర్యశక్తిని నేను గ్రహించితిని. కనుక తల్లీ! చాముండికా! నీ ముక్తిద్వారకవాటమును తెఱువుము.

**శ్లో॥ యుక్తాయుక్తవిచారదూరులకు నుద్యోగమ్బలభ్యంబిసీ**
**ధిక్తాపాత్రుడనంచుఁ ద్రోచెదె? కృతార్థీభూతు బ్రోపేల? తి**
**ర్యక్తుల్యుణ్డ జడుణ్డ నన్మనుచు టెన్తైనన్ యశంబౌగదా**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 6**

**ప్రతిపదార్థము :** యుక్తాయుక్త=యుక్తమిది, ఇది అయుక్తము అను, విచార= వివేకమునకు, దూరులకు=దూరమయిన వారికి, ఉద్యోగంబు=ఆత్మ యోగము, అలభ్యంబు=దుర్లభము, ఇసీ=ఛీ, ధిక్తా=ధిక్కారమునకు, పాత్రుడనంచు=తగినవాడనని, త్రోచెదె=త్రోసివేసెదవా?, కృతార్థీభూతు=అన్ని విధముల ధన్యుడయినవాని యొక్క, బ్రోపు=రక్షణ, ఏల=ఎందుకు, తిర్యక్తుల్యుండ=పశుప్రాయుడను, జడుండ=అజ్ఞానిని అగు, నన్=నన్ను, మనుచుట=రక్షించుట, ఎంతైనన్=ఎంతో, యశంబు=కీర్తి, ఔ గదా=అగును గదా!, ముక్తిద్వారము=మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా= చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ= బ్రతికించుదానా!, తీయగదె=తెఱవరాదా!



**తాత్పర్యము :** అమ్మా! యుక్తాయుక్తవివేకము లేని వానికి మహాయోగాలు ఎలా వస్తాయి? 'ఛీ ఛో' అని అనదగినవాడినని త్రోసిపారవేయవలదు. రక్షించవలసినది నావంటివారినే గదా! సర్వథా కృతార్థులయినవారిని రక్షించ వలసిన అవసరం ఏమి గలదు ? పశుప్రాయుడను అజ్ఞానిని నన్ను రక్షించడమే నీకు యశస్కరము. తల్లీ! మోక్షద్వారము తలుపు దీయుము.

**శ్లో॥ భుక్తుల్ స్వానుగుణమ్బుగా నొసగు స్వర్భూభార సౌరాళి యు**
**ద్రిక్తమ్బై కలదెన్తయైన నమృతార్థిన్ నన్ను వీక్షాసుధా**
**సిక్తుం జేయగ నోపునే? యది, భవత్సేవాప్యమౌగాన, నీ**
**ముక్తిద్వారము తల్పు దీయగదె! చాముణ్డా! జగజ్జీవనీ. 7**

**ప్రతిపదార్థము :** భుక్తుల్=కర్మఫల భోగములను, స్వానుగుణంబుగా=తమకు తగినట్లుగా, ఒసగు=ఇచ్చునట్టి, స్వర్భూభార=స్వర్గలోక, భూలోకాలకు భార=భారమయిన, సౌరాళి=దేవతా సమూహము, ఉద్రిక్తంబై=ఉద్రేకపూరిత మయి, ఎంతయైన=ఎంతో, కలదు=ఉన్నది. అమృతార్థిన్=అమృతమయిన జ్ఞానము యొక్క యాచకుడనయిన, నన్ను=నన్ను, వీక్షా=కటాక్షవీక్షణముల నెడు, సుధా=అమృతముతో, సిక్తున్=తడిసినవానిగా, చేయగన్=చేయగా, ఓపునే=చాలునా?, అది=ఆ అమృతము, భవత్=నీ, సేవా=సేవవలన, ఆప్యమౌగాన=పొందదగినది కనుక, నీ=నీవశములోనున్న, ముక్తిద్వారము= మోక్షద్వారముయొక్క, తల్పు=తలుపును, చాముండా=చండముండాసురులను చంపినదానా!, జగత్=ప్రపంచమునకు, జీవనీ=బ్రతికించుదానా!, తీయగదె= తెఱవరాదా!

**తాత్పర్యము :** ఇంద్రాదిదేవతలు సూర్యాదిగ్రహములునూ కర్మఫలములు తమ శక్తికొలది ఇచ్చెదరు. ఇట్టివారు చాలమంది గలరు. నేను గోరెడిది అమృతము. అనగా జ్ఞానరూప పరబ్రహ్మము. ఈ రాజస దేవతల వలన అది లభింపదు. అది నీ కటాక్షవీక్షణములవలననే లభించును. అందుకు నీ సేవ సాధనము. అమ్మా! కనుక నీ ముక్తిద్వారము తల్పు దీయరాదా?

**శ్లో॥ వక్తృజ్యామత దావకీన విజయవ్యాపారతారావళుల్**
**వాక్తన్తుచ్ఛట గ్రుచ్చి దిగ్గజగతి ప్రారమ్భముల్సేతు నా**